

శ్రీతల్పగిరి రంగేశ్వర కరుణా కటాక్షానువర్తి

కవిత్వ విద్యాపాండిత్య శిష్యానీక

కోదండ రామదాస ప్రణీతం

# రామభక్త కృష్ణభక్త సంవాదము

ఈ పుస్తకము ౧౮౭౪ సం॥ మొదటి ...

అచ్చు గూర్పించిన ప్రతులేగాని యీవల నదరు

గ్రంథము అచ్చుగూర్పనందున కంవనూరు యజ్ఞ

శర్మచే పరిష్కరింపంబడి, నెల్లూరు తాలూకా

లేబూరు గ్రామ నివాసియు శ్రీ మాస్త్రేశ్వరాభిషేక

పూజాపారీణుండగు తిక్కవరపు వంశపయః

పారావార రాకా సుధాకరుండగు

సుబ్బారెడ్డి అర్యపుత్రియు, శ్రీరామధ్యాన

తత్పరుండగు వెంకటరెడ్డి గాటూ రెడ్డి అర్యపత్నియు

పరివిధా లంకయునగు

సీతమాంబచే

సకలజన సులభ అభ్యుపాయమునకై

శ్రీ భవానీ ముద్రాక్షర శాలయందు

అచ్చుగూర్పించి ప్రచురింపంబడినది.

నెల్లూరు.

1910



## శ్రీ రామ జయము.

## రామ కృష్ణభక్తుల సంవాదము.

శ్లో॥ స్త్రీయంహత్వా రతిఘ్నవనీతచౌర్యం।
జారత్వమస్యగురుతల్ప కృతాపరాధం।
హత్యాందశాననహతేర్మధుపానదోషం
యత్పూతనాస్తనపయ స్సపునాతుకృష్ణః॥

శుద్ధకాంభోది రాగం. ఆదితాళము.

యేమోయివో కృష్ణభక్తుడా।
యేమిపర్వనీ దేవుఁకి।
నీమముగా నా రాముని గొల్చితే।
నిత్యపదంబొడ గూర్చుగదా।

అవునోయీవో రామభక్తుడా।
అతిగర్వము పడబోకుసుమీ।
వివరించియు నా కృష్ణునినమ్మితే।
యిహపరసౌఖ్యము లిచ్చుగదా॥

శ్రీభాసురమగు రాచకులములో।
చెలగురాజు నా రాముడు।
చెల్లినశూద్రులలో హీనతయగు।
గొల్లవాడు నీ కృష్ణుడు॥ ౧॥

బ్రాహ్మణపూజలొనర్చినవసుదే।
వ సుతుడుగద నాకృష్ణుడు।
బ్రాహ్మణహత్యను జేసినదశరథు।
పట్టిగదా నీ రాముడూ॥ ౨॥

చక్రవర్తియా దశరథరాజుకు।
జనియించెను నా రాముడు।
పశుపల్లెబోయుడు నందునకీ।
బుట్టినోడు నీ కృష్ణుడూ॥ ౩॥

శంఖచక్రపీతాంబరాదులతో।
జన్మించెను నా కృష్ణుడూ।
జడునివలెను క్యావు-క్యావనియేడ్చుచు।
జనియించెను నీ రాముడూ॥ ४॥

ఘనజ్ఞానుండగు జనకమహారా।
జానియల్లుడు నా రాముడు।
జనులలో సామాన్యపు రాజగుభీ।
ష్మకునియల్లుడు కృష్ణుడూ॥ ५॥

హాలమున హస్తిపురంబడ నెత్తిన।
బలునికితమ్ముడు కృష్ణుడు।
సొలసి రావణుచే మూర్ఛిల్లిన ల।
క్ష్మణునియన్న నీ రాముడూ॥ ६॥

పరమభక్తుడగు లక్ష్మణునకు సో।
దరుడుగదా నా రాముడు।
తరుచుగ కల్లును త్రాగుబలుని సో।
దరుడుగదా నీ కృష్ణుడూ॥ ७॥

అనగాను సత్యము దప్పని వసుదే।
వుని పుత్రుఁడు నా కృష్ణుఁడు।
ఆడిన మాటవిని సత్యము దప్పివి।
యతఃకోడుడు నీ రాముఁడూ॥ ౮॥

విశ్వామిత్రుఁడగు ఋషివద్దను।
విద్యనేర్చె నా రాముఁడు।
వెతలుబడె విసబాంధవొద్దను।
వెదకి చదివెనీ కృష్ణుఁడూ॥ ౯॥

కొండను గోటితో నెత్తియు గొల్లల।
గోవులబ్రోచెను కృష్ణుఁడూ।
కొండగుహాలలో చేరివసితై।
గుండుచుండెనీ రాముఁడూ॥ ౧౦॥

మెండగు కొండను కోతిచేత దే।
ప్పించెనుభళి నా రాముఁడు।
కొండగుహాలలోనలసి జేరకొని।
గొడ్లను మేపెను కృష్ణుఁడు॥ ౧౧॥

వకరిసహాయముకోరక దుష్టుల|
చకచకజేసెను కృష్ణుడూ|
వాయువనారదలగన్న్యాసలహా|
ల్వల్లగల్చె నీ రాముడూ|| ౧౨||

స్త్రీగమగ కౌసల్యాదితల్లులన|
పగముసనుంచెను రాముడు|
పరితవతల్లుల నెకరుడనుంచెనా|
పరిపగజెల్పుము కృష్ణుడూ|| ౧౩

వేణునాదమున జ్ఞానాజ్ఞానుల|
విరశులజేసెన కృష్ణుడూ|
వేదపురాణియు నడవిలో పత్నుల|
నిలధర్మపాపిస్తైను రాముడు|| ౧౪||

జలధికిపాలు గగనమున్పైపడినా|
జంకడుగద నారాముడు|
అలకణుణాని వకనాటి యుద్ధములో|
అందముదిప్పెను కృష్ణుడూ| ౧౫||

తనగురుపుత్రుడు యెవుడో వస్తె।
దనరగ దెచ్చెను కృష్ణుడూ।
తనసతికై బహుజటాయుమృతినీ।
తాచూస్తుండెను రాముడు॥ ౧౬॥

మునిశ్రేష్ఠులతో నారచీరెలును।
మురియుచు గట్టెను రాముడు।
వనితలుగట్టిన మైలచీరెలు।
వగచెడిగానె నీకృష్ణుడు॥ ౧౭॥

తరుచుగ గోపస్త్రీలనడుమనూ।
ధళధళమెరసెను కృష్ణుడూ।
వెరవుమాలికోతులమధ్యను వెల
వెలనివసించెను రాముడు॥ ౧౮॥

మూలబలముకును విశ్వరూపమును।
మొగిగనుపించెను రాముడు।
మొసలగుభీష్మునిదెబ్బలకోర్వక।
పుడమిబడెనేకృష్ణుడు॥ ౧౯॥

కోట్లగు సంసప్తకులనురుచే-
కొట్టించెను నా కృష్ణుడు।
కోతులభల్లూకాదుల చేర్చక।
కొట్టెను దనుజుల రాముడు॥ ౨౦॥

ధగధగ మెరసెడు రత్నకిరీటము।
ధరియించెను నా రాముడు।
తాకనిత్రుగులదినియెడు నెవళ్ల।
తోకలగట్టెను క్రిష్ణుడు॥ ౨౧॥

తల్లికిముజ్జగ ములుతననోటను।
తగజూపించెను కృష్ణుడు।
తల్లికి సన్న్యాసితనువుజూపియు।
తల్లడబెట్టెను రాముడు॥ ౨౨॥

పరమభామలనెడమాతృభావమున।
ప్రసిద్ధికెక్కెను రాముడు।
వరసవావిలేకను జారత్వము।
వల్లగేలుబడె కృష్ణుడు॥ ౨౩॥

యింద్రపుత్రునిచారదీసిబల్।
విరపిగనేలెమకృష్ణుడు।
యింద్రపుత్రుచాటుగదాగం
వేశడంచెనీరాముడు॥ ౨౩॥

సూర్యనిపుత్రునిరక్షించియుధా।
సురకీర్తనిగనెరాముడు!
సూర్యపుత్రునిదుర్బలవేళను।
సొంజంపించెనుకృష్ణుడు॥ ౨౪॥

విరివిగవిప్రస్త్రీలవల్లమేల్।
విందుభుజించెనుకృష్ణుడు।
పరువులేనిచెంచితశబరెంగిలి।
పండ్లుమెక్కెనీరాముడు॥ ౨౫॥

నమ్మినసుగ్రీవవిభీషణులన్।
రాజులజేసెనురాముడు।
నమ్మినభీమాదులనతిహీనత।
నవుకలజేశెనుకృష్ణుడు॥ ౨౬॥

బ్రహ్మసిగ్గుబడ-గొల్లలగోవుల।
బన్నెదలం జేసెకృష్ణుడు।
ప్రార్థనయింద్రుని జేసియు కపులను।
బ్రతికింపించెను రాముడు॥ ౨౮

శూలితో సమమగు యత్రిభరద్వా।
జులపూజలగొనె రాముడు।
బ్రాలెడు గొల్ల మసలిచీవాట్లను।
వగిగాబడెనీకృష్ణుడు॥ ౨౯

గొప్పగు రాజుల గెల్చిరుక్మిణిని।
మెప్పుగ దెచ్చెను కృష్ణుడు।
తుప్పవిల్లు దును మాడిజానకిని।
దోడ్కొనివచ్చెను రాముడు॥ ౩౦

పొలుపుగ మణిగణ విస్ఫురితంబగు।
పుష్పకమెక్కెను రాముడు।
వెలమలగృహముల దొరబడి వుట్లకు।
వెసవెక్కెను నీకృష్ణుడు॥ ౩౧

సత్యభామకై-కల్పవృక్షమును।
క్షణమునదెచ్చెనుకృష్ణుడు।
జనకజవేడితె లేడినితేలే।
కనుబోయెను నీరాముడు॥ ౩౨

సూర్యునిబడ వేడుకనంబెత్తెను।
సురలుతల్లడిలరాముడు।
సూర్యునిపోరమ్మనలేకను నీ।
చునిగారడిజేసె కృష్ణుడు॥ ౩౩

బలివిడిసడవినికాచిఱచొప్పిన।
అలయుక్రమింగను కృష్ణుడు।
భార్యనుకార్పిచ్చులోబడమని।
బంపెగదా నీరాముడు॥ ౩౪

వడిగల ఖరదూషణబాణంబులు।
సమమనెద్రుంచెనురాముడు।
సడలిన భీష్ముని శరములవాల్చియు।
చిరిమురిపడె నీకృష్ణుడు॥ ౩౫

బగవడిచెందఁ మిచ్చిన కబ్జను।
శరిగా జేసెను కృష్ణుడు।
మంచిపండ్లు మెచ్చిన శబరిగ్నిలో।
బడచూస్తుండెను రాముడు॥ ౨౯

బరిచకతమ్ముని మాటనునుని భీ।
షణుని సెల్వెనా రాముడు।
చెఁపించెనుగద అన్నశిష్యుని।
మఱుగుసౌజ్ఞచే కృష్ణుడు॥ ౩౦

క్షణముల న శిశుపాలుని శిరమును।
ఖండించెను నాకృష్ణుడు।
సప్తరాత్రులనుఘోరకాడిగద।
చంపె రావణుని రాముడు॥ ౩౧

అమరులగెల్చిన రావణుతో యు।
ద్ధము జేసెను నా రాముడు।
అల్పభక్తులగు ఎల్లులతోడను।
సల్పెను యుద్ధము కృష్ణుడు॥ ౩౨

పిడికెడు మటుకులు నొసగుదాపసి।
బేహసి జేసెను కృష్ణుడు।
అడియాశములిచ్చినసుగ్రీవుని।
కడకొట్టించెను రాముడు॥ ౪౦

మగలాడ్డికిబంపెను లంకలాదర।
మగువలనెల్లను రాముడు।
మగలేద్వగ వనముకు గోపికలను।
మొగిరప్పించెను కృష్ణుడు॥ ౪౧

జలధిలా జొరబడి వరుణొద్దకుబల్।
జబరుగబోయెను కృష్ణుడు।
జలధిని శరణని మూడుదివసముల।
సరివస్త్రులబడె రాముడు॥ ౪౨

కదశిబాణమున జలధిని గడగడ।
గడవణకించెను రాముడు।
అదనుడైనబోయవానిశరమున।
నదరుదుబడె నీ కృష్ణుడు॥ ౪౩

వొద్దులకెంటిని హాశ్చర్యముగా।
మనుజులజేసెను కృష్ణుడు।
ముద్దులగులేడు సప్తతాళములు।
మొద్దులజేసెను రాముడు॥ ౪౮

కలనైనదబ్బరలాడని మేల్।
ఘనుడుగ నా రాముడు।
నిలువెల్లను బల్ ఝూటాకోరని।
నిందెలబడె నీ కృష్ణుడు॥ ౪౯

చీనాంబరములు దివ్యచందనము।
చెలగి ధరించెను కృష్ణుడు।
జింకచర్మమును పేడబూ కిదెయు।
కొంకక దాల్చెను రాముడు॥ ౫౦

మునిఋషివరులతో మెలాడనులతో బల్।
పూజలనొందెను రాముడు।
వనితలచే చీపురుచాటల చే
బ్బలుదినెగద నీ కృష్ణుడు॥ ౫౧

వనితరుక్మిణీ వరియించినదా!
వ ప్పనుగదనాకృష్ణుడు।
వనితశీతనూ జోగివెంబడి!
జనిచేకొనెనే రాముడు॥ ౫౨

పగతునితమ్ముడు శరణంటే స।
న్మానించెనునా రాముడు।
పరమభక్తుడగు భీష్మునికొరకుఁగ।
పడవేయించెను కృష్ణుడు। ౫౩

సరికౌస్తుభమణి పీతాంబరముల।
చలగివటించెను కృష్ణుడు।
చట్లపూసలతో నారగుడ్డలతో।
సంచరించె నీరాముడు॥ ౫౪

నేతోత్సవముగ పట్టపగలు మేల్।
నెనరుగబుట్టెను రాముడు।
నిశిరాత్రిని చోరునివలె కయిదులో।
నరిబుట్టెను నీకృష్ణుడు॥ ౫౫

రజకునిగర్వపు మాటలవానిశి।
రముద్రుంచెను నాకృష్ణుడు।
రజకునిమాటలకై యడవికిభా।
ర్యనుబంపెను నీ రాముడు॥ ౫౬

విశ్వామిత్రునియజ్ఞ మేలి చే।
ర్వనుతులొందె నా రాముడు।
విశ్వాసములేకను దొంగిలివిరి।
విగతిట్లను బడెకృష్ణుడు॥ ౫౭

బాణముపట్టక నే బలరథుల।
బరిమార్పించెనుకృష్ణుడు।
పటుతర అక్షయబాణములుండియు।
బహుమార్గ్భలబడె రాముడు॥ ౫౮

ధరణీవైష్ణవ పూర్వావృందములు।
ధరియించెను నా రాముడు।
పారలుచు అడంగులవలె కస్తురి।
బొట్టుబెట్టెనికృష్ణుడు॥ ౫౯

రాజులు మేల్ భళీ భళి యన నర్జుని।
రథమెక్కెను నా కృష్ణుడు।
తేజము తగ్గగ యుద్ధ వేళకో।
తిని నెక్కెను నీ రాముడు॥ ౬౦

పరస్త్రీలను తాకక శీతమ్మకు।
మురిపెము బెట్టెను రాముడు।
పరభామలతో పోయి భార్యలను।
మరి దుఃఖములిడె కృష్ణుడు॥ ౬౧

సతుల నేకుల నరకుడు బెట్టిన।
చర విడిపించెను కృష్ణుడు।
సాధ్వి శీతనూ రావణుడెంట్లో।
చర పెట్టించెను రాముడు॥ ౬౨

అర్జునిగ్రహించిన వీరుని గర్వము।
నణచెని మేషమున రాముడు।
అర్జునిగు గ్రపు రా ణ్డైయాతని।
యాజ్ఞలోనుండెను కృష్ణుడు॥ ౬౩

జననీజనకులచెరలుమాన్పిబల్ ।
సౌఖ్యము బెట్టెను కృష్ణుడు।
జననివిధవగా తండ్రిమృతుడుగా।
వనమునకేగెను రాముడు॥ ౬౪

సత్యవ్రతుడగు యువరాజు విభీ।
షణుని నేలె నారాముడు।
సత్యసంధుడగు దానకర్ణునిన్।
చంపించెను నీకృష్ణుడు॥ ౬౫

శంకచక్రశార్ఙ్గ ఖడ్గగదమరి।
చలగిధరించెను కృష్ణుడు।
చలమతులౌ రాజులవలె విల్లంబులు।
చేతబట్టెను రాముడు॥ ౬౬

తనవెంబడివచ్చిన వానరులం।
దర బ్రతికించెను రాముడు।
తాజేరినసైన్యంబునుకూడా।
దగ్ధమొనర్చెను కృష్ణుడు॥ ౬౭

బాపనివల్లను వుత్తరమేడ్చితే।
పాలించెను నా కృష్ణుడు।
భార్యావియోగంబునకు జడునివలె।
పడిపడియేడ్చెను రాముడు॥ ౭౮

శాస్త్రపద్ధతిగ- జనకునిసమ్మతి।
సతిపెండ్లాడెను రాముడు।
క్రీస్తుమతమువలె స్త్రీసమ్మతివే।
గిరపెండ్లాడెను కృష్ణుడు॥ ౭౯

త్యాజ్యముపెద్దల సొత్తుకోరక।
ద్వారకయేలెను కృష్ణుడు।
రాజ్యము పెద్దలు గణించకానొక।
ప్రభువని వెలసెను రాముడు॥ ౮౦

అగభణశ్రీమంతునియింట్లో।
అవతరించెనా రాముడు।
అన్నములేకను పొరిగంటనుపెరి।
గావులమేపెను కృష్ణుడు॥ ౮౧

రాసక్రీడారమ్యతరోత్సవ।
రసముగ్రహించెను కృష్ణుడు।
గాశిలినడవుల రాలెనఫలరస।
మూసించెను నీరాముడు॥ ౨౨

సన్నుతగుణగణుడై బాంధవ।
సౌఖ్యమొనర్చెను రాముడు।
అన్యోన్యతకలహంబునయాదవు।
లందరినణచెను కృష్ణుడు॥ ౨౩

గగనముసరియగు యెదుటనెకంసుని।
ఖండించెను నాకృష్ణుడు।
మొగశిరిగాదని యంచకవాలిని।
పొంచికొట్టె నీరాముడు॥ ౨౪

సలలితపటుదోర్బలాల విభవంబున।
జలనిధిగట్టెను రాముడు।
కలకలబాయుచు స్త్రీచేరోటను।
గట్టబడెను నీకృష్ణుడు॥ ౨౫

వనజజుఁడెఱుఁగని విశ్వరూపము।
జనకుఁ జూపెనా కృష్ణుఁడు।
తనసతిఁబాసిన దీనాకృతిర వి।
తనుజునకుఁ జూపెను రాముఁడు॥ ౨౬

తనయిరువంకలవారు సంతసిలఁ।
తగఁ బెండ్లాడెను రాముఁడు।
తనమఱిదియు చుట్టాలును వేడ్వఁగ।
తాఁ బెండ్లాడెను కృష్ణుఁడు॥ ౨౭

ఘనగోవర్ధన మెత్తియింద్రుని।
గర్వంబణఁచెను కృష్ణుఁడు।
వనచరులను బ్రతికింపుఁడని యిం।
ద్రుని ప్రార్థించెను రాముఁడు॥ ౨౮

కోవిదు లెన్నఁగ-రాజ్యవిభుత్వము।
గొప్పగ జేశెను రాముఁడు।
గుఱ్ఱపుపని గాకను మంగళపని।
కూడా జేసెను కృష్ణుఁడు॥ ౨౯

కొనలుచు ద్రౌపది కృష్ణా యనన య
త్తుయచీరలనిడె కృష్ణుడు।
తన సతిలంకలోపడి మొఱ చెదరి।
తా తెలియడు సీరాముడు॥ ౮౦

ఎదురుగ జనక ఖరదూషణదనుజుల।
చిదుముగ దునిమెను రాముడు।
వెనుకొని యావను సుందరిమగ దాచుచు
వెనగుహజొచ్చెను కృష్ణుడు॥ ౮౧

అష్టభార్యలకు అమితగోపికల।
కతిసౌఖ్యములిడె కృష్ణుడు।
అడవినితనవక భార్యను నడిపిం।
చతికష్టములిడె రాముడు॥ ౮౨

హనుమంతునియల్లప్పటికినిశూ।
రునిగానుంచెను రాముడు।
తనతదనంతరమవమానము స।
జాననకొనరించెను కృష్ణుడు॥ ౮౩

పదపడి మోహితులైన గోపికల।
మదిగరగించెను కృష్ణుడు।
ముదమునవలచినసతిముకుఁచెవుల్।
మొగిగోయించెను రాముడు॥ ౧౪

వనమునఘనమగు ఋషులమునులవెం
బడిదిరిగను నారాముడు।
వనమునపశువులగొల్లలవెంటను।
వెనుకొనిదిరిగనుకృష్ణుడు॥ ౧౫

తననురకుఁజాయ్వచ్చినశకటుని।
క్షణమునద్రుంచెను కృష్ణుడు।
తనమోసముజాయ్వచ్చిన లేడికి।
తామోసబడెను నీ రాముడు॥ ౧౬

తెలివిదప్పరావణుతో నలసట।
దీర్ఘకరమ్మనె రాముడు।
దిట్టగుకర్ణుడు రణములోజికిఁతే।
కొట్టుకొట్టుమనెకృష్ణుడు॥ ౧౭

వచ్చిన అన్నల దెచ్చి తల్లికిని।
మెచ్చగజూపెను కృష్ణుడు।
వచ్చినతండ్రిని దెచ్చితల్లికిని।
దానివ్వడు నీ రాముడు॥ ౮౮

కనలుచు దాహాటముగ నింద్రజి।
త్తును జంపించెను రాముడు।
క్రమముదప్పి సైంధవునిక్ మోసము।
గా జంపించెనుకృష్ణుడు॥ ౮౯

అగరుడునిపైనెక్కెను ఘనముగ।
హరిదేవుడు నాకృష్ణుడు।
అధమునివలె కాల్నడకతో కఠినవు।
అడవినినడిచెను రాముడు॥ ౯౦

నరులుసురలుమెత్తరానిశ్రీశం।
కరువిల్ దునిమెనురాముడు।
నరుడుజరాసంధునికియోడిబల్।
పరుగిడిదాగెను కృష్ణుడు॥ ౯౧

నాగవిభునివిషము గ్రక్కున నె త్రిసి।
నాట్యమాడెనా కృష్ణుడు।
నాగపాశములయూగ్బలనొందియు।
నగుబాటొందెను రాముడు॥ ౯ ౨

భార్యనుముందుగ వైకుంఠమునకు।
బంపితాజనె రాముడు।
మాయకులునిచే నేల్బడిభార్యల।
బోయలపాల్ జేసె కృష్ణుండు॥ ౯ ౩

తండ్రిసర్పముచె కృష్ణకృష్ణయన।
దారక్షించెను కృష్ణుడు।
తండ్రిరామరామాయనిచస్తె।
తానొప్పెను నీరాముడు॥ ౯ ౪

అలవిభీషణుకు లంకయిత్తునని।
యటుయొసగెను నారాముడు।
అంబుబట్టనని ప్రతిజ్ఞజేసియు।
యావుడెబట్టె నీకృష్ణుడు॥ ౯ ౫

బ్రహ్మవేత్తమాటలువిని భార్యను।
పరిణయించె నాకృష్ణుడు।
మరిచాకలిమాటలచే భార్యను।
వనమునకనిపెను రాముడు॥ ౯౬

ఎరిగినతిరిగన నమ్మినవారల।
పరముకుగొనిచనె రాముడు।
మరుదులనలుపురమరిహోతువులయము।
పురికిబంపె నీకృష్ణుడు॥ ౯౭

బ్రహ్మను తనపాదములబడేట్టుగ।
ప్రబలెరుగద నా కృష్ణుడు।
భ్రష్టుని బ్రహ్మాస్త్రముచే నేలబడి।
పరితపించె నీ రాముడు॥ ౯౮

అలరెడుకేకయతాతబాధసం।
హరణింపించెను రాముడు।
చలముగమరిదిని తలగడ్డము రే
వుఁగ గొరిగె నీ కృష్ణుడు॥ ౯౯

శంకరవిధియింద్రులగల్గియు భువి।
సంచరించె నాకృష్ణుడు।
శంకించెను సంకరుడగువానరు।
చింతజేరె నీ రాముడు॥ ౧౦౦

సతిచనుబాడచిన కాకాసురుని।
సంరక్షించెను రాముడు।
చనుబాలివ్వను వచ్చినవనితను।
చంపెసుగద నీ కృష్ణుడు॥ ౧౦౧

చెదరిజనులకాల్చను వచ్చినకా।
ర్చిచ్చును మ్రింగెను కృష్ణుడు।
కదసిబండిపోటులవలె లంకను।
కాల్పించెను నీ రాముడు॥ ౧౦౨

హనుమంతంగదులకు లంకలాజయ్యు,
మగుపరిచెను నా రాముడు।
అలకణుణానిచే ధర్మజభీముల।
బలునొప్పించెను కృష్ణుడు॥ ౧౦౩

వరుణునివద్దికిబో యి తండ్రిని।
వనరుగ దెచ్చెను కృష్ణుడు।
వనరుచేరియు తండ్రిబోతె నేల్బడి।
వలవలయేడ్చెను రాముడు॥ ౧౦౪

బ్రతకనిభార్యను తమ్ముడుబడితే।
బ్రతుకజేసుకొనె రాముడు।
గతిచేకను మేనల్లుడువస్తే।
బ్రతికింపడుగద కృష్ణుడు॥ ౧౦౫

అన్నభార్యను తల్లిగనెంచిన।
అర్జునుచేకొనె కృష్ణుడు।
అన్నభార్యతారనుగూడినదు!
నిర్జరయునేలెను రాముడు॥ ౧౦౬

అకలంకముగను దశరథసుతుడై।
అటుపేరొందెను రాముడు।
వకనికిబుట్టి మరొకనికిబిడ్డని।
వతిలించెను నీకృష్ణుడు॥ ౧౦౭

మేలగు చెల్లె సుభద్ర గోరితె।
మేరకాదనె కృష్ణుడు।
బిడ్డ నెంచక భూసుతసీతను।
పెండ్లాడెను సీరాముడు॥ ౧౦౮

విధిహరిహరులను బాలుల జేసిన।
వెలదివిందుగొని రాముడు।
భిక్షువు బాపని తిరిపెపు అటుకలు।
భక్షించెను సీకృష్ణుడు॥ ౧౦౯

తల్లిమాటజవదప్పని సాధుడు।
తెగినమరిది నాకృష్ణుడు।
తల్లిని పైబడి నరకబోవు శ।
త్రుఘ్నునాపెను సీరాముడు॥ ౧౧౦

యజ్ఞమేలిమేల్ యజ్ఞము జేసెను।
ప్రతిజ్ఞ గలుగు నారాముడు।
యజ్ఞము భంగము జేయుటగాకే।
యజ్ఞము జేయడు కృష్ణుడు॥ ౧౧౧

యజ్ఞఫలదుడూ దానయ్యుంటే।
యవరికి జేసును కృష్ణుడు।
యజ్ఞము నెపమున ద్రవ్యాకర్షణ।
యలమిజేసె నీరాముడు॥ ౧౨

బ్రహ్మకు సమానుగదవరెడు సుభర।
ద్వాజువిందుగాని రాముడు।
వనరుగాని దాసీపుత్రునియిం।
టనుమెక్కెను నీ కృష్ణుడు॥ ౧౩

యింద్రసమాన కూర్చునివచ్చిన।
వీరసఖుడు నా కృష్ణుడు।
యింద్రునిసుతుచే దెబ్బలుదినుడు।
ర్వయసఖుడు నీ రాముడు॥ ౧౪

ఘనరాజులచే మొక్కులొందు మేల్।
ఘనతరాజు నా రాముడు।
కల్లుదాగినమర్యాదయాదవుల।
కధిపతిగద నీ కృష్ణుడు॥ ౧౫

భువి ఘుమఘుమ వాసన కస్తూరి।
బొట్టుపెట్టె నా కృష్ణుడు।
భువిభిక్షులజంగాలుబెట్టుదు।
ర్భ్యాడిదెబలాసెను రాముడు॥ ౧౧౬

మౌనియతుల పాలిటివాడనియని।
పాలించెను నా రాముడు।
పాండవపక్షుండని పేరొందియు।
బహుబాధలనిడె కృష్ణుడు॥ ౧౧౭

రాయభారముకు బోయికుతంత్రుల।
రభసముజేసెను కృష్ణుడు।
లంకకుజని దనుజులమాయలబడి।
శంకించెను నీ రాముడు॥ ౧౧౮

తననగలును యింద్రుడొసగుహారము।
హనుమాదులకిడె రాముడు।
తనపెండ్లికివచ్చిన కట్నములను।
తాకాజేసెను కృష్ణుడు॥ ౧౧౯

పటుతలంపుచే కుబ్జకు చేలుకు।
భాగ్యమొసంగెను కృష్ణుడు।
యిటువలెవకరిటి దెల్పుమువిని యెద।
యేమి జేసెనో రాముడు॥ ౧౨౦

మునుకోసి నెల్లూరి రంగవినిరతము।
పూజించెను నా రాముడు।
తనువుయెత్తివక దేవుడైనా।
దలచలేదు నీకృష్ణుడు॥ ౧౨౧

యేకాంతపు భక్తులవలె పూజను।
యెవరికిదెల్పదు కృష్ణుడు।
లోకులమెప్పుకుగా జందాలుకు।
చేకొనిజేసెను రాముడు॥ ౧౨౨

మనమిద్దరకిక వాదమేలను।
మారాముడు మీకృష్ణుడు।
దనరగ వకరేయని జెప్పెనుకో।
దండరామదాసుడు మేల్ఘనుడు॥ ౧౨౩

సదరు పిళ్ళారిశెట్టి కోదండరామదాసు
చెప్పినప్రకారము రాజీపత్రి
మంగళహారతి పాడిరి.

జంపెతాళం. నాటరాగము.

మంగళం శ్రీరామచంద్రాసిత్యశుభ మంగళం॥
శ్రీకృష్ణమన్నన సురేంద్రా మంగళం॥౧॥

కౌసల్యాదశరథసుపుత్రా। దేవకీ। కాంత
వసుదేవసుత ఘనతచారిత్రా మం॥ ౨॥

పర్ణకసరోజ    గవాసా। వుల్లాస। పాప
హరణ్యా    పట్టణవిలాసా॥మం॥ ౩॥

శీతావనోద్భవసద్భృంగా। శ్రీరంగ। శ్రీరుక్మిణీ
నాథ శ్రితజనోత్తుంగా॥మంగళం॥ ౪॥

ధశకంఠ కంఠవిచ్ఛేదా। సత్వాద। శిశుపాల
మారణ కర్తై దివ్యవినోదా॥మంగళం॥ ౫॥

లలిత నెల్లూరిపురిపాలా। కోదండరామదాస
విలోల। రాజితసుచేలా॥ ౬॥

శ్రీరామ కృష్ణభక్తసంవాదం. సంపూర్ణము.

